

# మొల్లరామాయణము

## రామలక్ష్మణులు విశ్వామిత్రునియాగము సంరక్షించుట

సీ. ఒకనాఁడు శుభగోష్ఠి నుర్వీశ్వరుఁడు మంత్రి
హితపురోహితులును నెలమిఁ జేరి
బంధువర్గము రాయబారులుఁ జారులుఁ
బరిచారకులు నెల్ల సరవిఁ జేరి
గాయకులును భృత్యగణములు మిత్రులు
సతులును సుతులును జక్క నలరి
సరసులు జతురులుఁ బరిహాసకులుఁ గళా
వంతులుఁ గడునొక్కవంకఁ జేరి

గీ. కొలువఁ గొలువున్నయెడవచ్చి కుశికపుత్త్రుఁ
డర్థిఁ దీవించి తా వచ్చినట్టికార్య
మధిపునకుఁ జెప్ప మదిలోన నార్తిపడుచు
వినయ మొప్పార నిట్లని విన్నవించె.

# మొల్ల రామాయణము.

క. రాముఁడు దనుజాలతో సం
గ్రామము సేయంగఁ గలఁడె కందుగదా! నే
నే మిమ్ముఁ గొలిచి వచ్చెద
నో మునిరాజేంద్ర! యరుగు ముచితప్రౌఢిన్. 2

మ. అనినం గౌశికుఁ డాత్మనవ్వి వినుమయ్యా రాజ! నీచేతఁగా
దనరాదైనను రాక్షసుల్ విపులగర్వాటోపబాహాబలుల్
ఘనుఁ డీరాముఁడు దక్క వారిఁ గెలువంగా రాదు పిన్నంచు నీ
వనుమానింపక పంపుమింకఁ గ్రతురక్షార్థంబు భూనాయకా. 3

వ. అని ప్రియోక్తులు వలుకుచున్న విశ్వామిత్రునకు మిత్రకుల పవిత్రుం
డైన దశరథుండు మాఱాడవోడి యప్పుడు. 4

క. మునినాథు వెంట సుతాత్రి
ముని వలజడి పెట్టుచున్న మూర్ఖులపై రా
ముని సౌమిత్రిని వెస న
[illegible]్కనితో నానందవార్ధి మునుఁగుచు బనిచెన్. 5

మత్తకోకిలము.

[illegible]ని కౌశికుం డట వచ్చునయ్యెడ ఘోరకా

# బాలకాండము.

ఘోరమధ్యమునందు నొక్కతె దైత్యకామిని భీకరా
కార మొప్పఁగ నట్టహాసవికాస మేర్పడ రాఁగ నా
క్రూరరాక్షసిఁ జూచి యమ్మునికుంజరుం డొగి రామునిన్.

క. తాటక వచ్చిన దదిగో
నాటగ నాఁడు దని మేల మాడక నీ వీ
పాటి వడ నేయు మని తన
చాటున భయపడెడి రామచంద్రున కనియెన్.

వ. ఇట్లుచెప్పిన యీమునిచంద్రుని పల్కులాలించి రామచంద్రుండు
తనయంతరంగమ్మున నిట్లని వితర్కించె.

క. ఈయాఁడుదానిఁ జంపఁగ
న్యాయమ్మున కేమిగొప్ప నగరే వీరుల్
ఛీ యని రోయుచు నమ్మని
చాయకుభయ మెఱిఁగి తనమనమ్మున నలుకన్.

క. వ్రేటు గొనిరామచంద్రుఁడు
నూటిగ నొకదిట్టకోల సురలు నుతింపన్

ఘోటకసమవక్షస్స్థలఁ
తాటక నత్యుగ్రలీల ధరపైఁ గూల్చెన్. 10

వ. ఇట్లు తాటకం గీటణంగించినయంత నమ్మునీంద్రుండు మేటి సంతోషమ్మున రాముని గొనియాడుచు సక్రమంబుగ నిజాశ్రమంబున కేతెంచి రామసౌమిత్రుల సాయంబున జన్నంబు సేయుచున్న సమయంబున. 11

క. ఆకాశవీధి నెలకొని
రాకాసులు గురిసి రమితరక్తముఁ బలలం
బాకాశికుయజ్ఞమునై
భీకరముగ మునిగణంబు భీతిం బొందన్. 12

ఉ. అంబరవీథి నిల్చి త్రిదశాంతకు లెంతయు చేసి రక్తమాం
సంబులు గాధినందనుని జన్నముపైఁ గురియంగ నంతలో
నంబరరత్నవంశకలశాంబుధిచంద్రుఁడు రామచంద్రుఁడు [13
గ్రంబుగ దుంచెఁ జండబలగర్వులఁ దమ్ముఁడుఁ దానునొక్కఁడై.

వ. ఇట్లు రామచంద్రుండు సాంద్రప్రతాపంబుమించ నిందారుఁ

దు్రించిన నమ్మునిచంద్రుఁడు నిర్విఘ్నంబుగా జన్నం బొనర్చి
రామసౌమిత్రులం బూజించె నట్టి సమయమ్మున. 14

## —♦ సీతా స్వయంవరము. ♦—

క. ధరణీసుత యగు సీతకుఁ
బరిణయ మొనరింప జనకపార్థివుఁ డిల భూ
వరసుతుల రండని స్వయం
వర మొగిఁ జాటించె నెల్లవారలు వినగన్. 15

వ. ఇట్లు స్వయంవర మహోత్సవ ఘోషంబున సంతోషంబునొంది వి
శ్వామిత్రుండు రామసౌమిత్రుల మిథిలానగరంబునకుఁ దోడ్కొ
ని చనుచుండు మార్గంబున 16

క. ముదితాపసి వెనువెంటను
వదలక చనుదెంచునట్టి వడి రాముని శ్రీ
పదరజము సోఁకి చిత్రం
బొదవఁగఁ గనుపట్టె నెదుట నొకయుపల మటన్. 17

క. పద్రా యొప్పిదమె కదుఁ

గడలుచు బంగారుపూడె కరఁగినరీతిన్
బొదలుచు లావణ్యస్థితి
సుదతిగఁ జూపట్టి నిలచె నుపచిరలీలన్. 18

ఉ. ఆమునివల్లభుండు గొనియాడుచు బాడుమ వేడ్కతోడ శ్రీ
రాముని జూచి యిట్లనియె రామ ! భవత్పదధూళిసోఁకి యీ
భామిని రాయి మున్ను కులపావనమూడఁగ జత్రిమయ్యె నీ
నామ మెఱుంగువారలకు నమ్మఁగవచ్చును భుక్తిముక్తులున్. 19

వ. అని యక్కాంతారత్నంబు పూర్వవృత్తాంతం బంతయు నెంతె
యు సంతసమ్మున నమ్మనుజేంద్రనందనుల కెఱింగింపుచు మిథిలా
నగరంబునకుం జనియె నచ్చట. 20

సీ. ద్రావిడ కర్ణాటాంధ్ర యవన మహారాష్ట్ర
రాజకుమారులు తేజ మలరఁ
బాంచాల ఘూర్జర లాట బర్బర మళయాళ
భూపనందనులు విస్ఫూర్తిమీఱ
గౌళ కేరళ సింధు కాశ కోశల సాళ్వ
ధరణీశపుత్త్రులు సిరి వెలుంగ

మగధ మత్స్య కళింగ మాళవ నేపాళ
నృపతనూభవులు నెన్నికకు నెక్క
గీ. మఱియు నుత్కల కొంకణ మద్ర పాండ్ర
వత్స గాంధార సౌరాష్ట్ర వంగ చోళ
రాజ్యముల నొప్పుభప్పన్న రాజసుతులు
వచ్చి రక్కామినీ స్వయంవరమునకును. 21

ఉ. కొందఱు పల్లకీల మఱికొందఱు తేరుల నందలంబులన్
గొందఱు కొందఱశ్వముల గొందఱు మత్తగజేంద్ర సంఘముఁ
గొందఱు స్వర్ణడోలికలఁ గోరిక నెక్కి నృపాలనందనుల్
సందడిగాఁగ వచ్చిరి భుజంబు భుజంబును ద్రోపులాడగన్. 22

వ. అట్టి సమయంబున. 23

చ. గురుభుజశక్తిగల్గు పదికోట్లజనంబులఁ బంప వారు నా
హరుని శరాసనంబుఁగొని యాడుచుఁ బాడుచుఁ గొంచువచ్చిను
స్థిరముగ వేదిమధ్యమునఁ జేర్చిన దానికిధూపదీపముల్
విరులును గంధ మక్షతలు వేడుక నిచ్చిరి చూడ నొప్పఁగన్. 24

వ. అట్టి సమయంబున జనకభూపాలుండు రాజకుమారులం గనుంగొని యిట్లనియె. 25

ఉ. కొంకక సావధానమతిఁ గూర్చి వినుం డిదె మత్కుమారికై
యుంకువ సేసినాఁడ వివిధోర్వ్యల వైనధనంబుఁ గాన నీ
శంకరుచాప మెక్కిడిన సత్త్వఘనుం డగువాని కిత్తు నీ
పంకజనేత్రి సీత నరపాలకులార! నిజంబు సెప్పితిన్. 26

గీ. అనుచుఁ బలుకుచున్న యవనీశతిలకుని
వాక్యములకు నుబ్బి వసుమతీశ
సుతులు దాముతామె మతిలోన జెలఁగుచు
దగ్గరంగఁ బోయి ధనువుఁ జూచి. 27

క. విల్లా యిది కొండా యని
తల్లడపడి సంశయంబు తలకొన మదిలో
బల్లిదు లగు నృపనందను
లెల్లరు దౌదవుల నుండి రెంతయు భీతిన్. 28

క. కొండయు దగ్గర నోడిరి

# బాలకాండము.

కొందఱు సాహసముచేసి కోదండముతో
నందంద పెనగి పాఱిరి
సందుల గొందులను దూఱి సత్త్వము లేమిన్.

సీ. గాలిఁ దూలినరీతిగా నెత్తఁ జాలక
తముఁ దామె నిగ్గునఁ దలలు వంచి
కౌఁగలించిన లోను గాక వెగ్గలమైన
భీతిచే మిక్కిలి బీరువోయి
కరముల నందంద పొరలించి చూచినఁ
గదలకయున్నఁ జీకాకుపడుచుఁ
బాషాణ మున్నట్టిపగిది మార్దవ మేమి
కాన రాకుండినఁ గళవళించి

గీ. రాజసూనులు కొందఱు తేజ ముడిగి
జగతి రాజుల మోసపుచ్చంగఁ దలఁచి
జనకు డీమాయఁ గావించెఁ జాలు ననుచుఁ
దలఁగి పోయిరి దవ్వుగా ధనువు విడిచి.

సీ. ఇది పర్వతాకార మీవిల్లు కనువిచ్చి

తేరి చూడఁగ రాదు దేవతలకు
నటు గాక మును శేషకటకునిధను వంటు
హరుఁడె కావలెఁ గాక హరియుఁ గాక
తక్కినవారికిఁ దరమె యీకోదండ
మెత్తంగఁ దగుచేవ యెట్లు గలుగు
దీని దగ్గర నేల దీని కోడఁగ నేల
పరులచే నవ్వులు పడఁగ నేల
గుఱుతు నేసియుఁ దమలావుకొలదిఁ దామె
తెలియవలెఁ గాకయూరక తివుర నేల
యొరుల సొమ్ములు తమ కేల దొరుకు ననుచుఁ
దలఁగి పోయిరి రాజనందనులు గనుచు. 31

అంత విశ్వామిత్ర మునీంద్రుండు రామచంద్రుని ముఖావలోకనంబుఁ జేసిన. 32

కదలకుమీ ధరాతలమ కాశ్యపిఁ బట్టు ఫణీంద్ర భూవిషా
స్పదులను బట్టు కూర్మమ రసాతలభోగిఢులీకులీకులన్
వదలక పట్టు ఘృష్టి ధరణీఫణికచ్ఛపపోత్రి వర్గమున్
జోదవుచుఁ బట్టుడీ కరులు భూవరుఁడీశుని చాపమెక్కిడున్. 33

క. ఉర్వీనందనకై రా
మోర్వీపతి యెత్తు నిప్పుడుగ్రవిచాపం
బుర్వింబట్టుఁడు విగ్దం
త్యుర్వీధర కిటిఫణీంద్రులూఁతఁగఁ గడిమిన్. 34

వ. అనుచు లక్ష్మణుండు దెలుపుచున్న సమయంబున. 35

మ. ఇనవంశోద్భవుఁడైన రాఘవుడు భూమీశాత్మజుల్ వేడ్కతోఁ
దను వీక్షింప మునీశ్వరుండలరఁ గోదండంబు చేనందిచి
వ్వన మోపెట్టి గుణంబు పట్టి పటు బాహాశక్తితోఁ దీసినన్ (36
దునిఁగెన్ జాపము భూరిఘోషమున వార్ధుల్ మ్రోయుచందంబునన్

గీ. ధనువు దునిమినంత ధరణీశసూనులు
శిరములెల్ల వంచి సిగ్గు వడిరి
సీత మేను వెంచె శ్రీరామచంద్రునిఁ
బొగడె నపుడు జనకభూవిభుండు. 37

వ. ఇట్లు శ్రీరామచంద్రుని సత్త్వసంపదకు మెచ్చి సంతోషించి జనక
మహారాజు వివాహంబు సేయువాఁడై రమ్మని దశరథేశ్వరుని పేరి

ట శుభలేఖలు వ్రాయించి పంచిన దశరథమహారాజును నా శుభలేఖలం జదివించి సంతోషంబున నానందబాష్పంబులు గ్రమ్మ దేర మంత్రిప్రవరుం డగు సుమంత్రునిం బిలుపించి సుమంత్రా! యిప్పుడు మనమందఱమును బయలుదేరి మిథిలాపట్టణంబునకుం బోయి యట జనకమహారాజునింట మనరామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు వివాహమహోత్సవము జరుపవలయుఁ గావున వశిష్ఠాది ద్విజవర్యులను గౌసల్యాది కాంతాజనమ్మును నరుంధతి మొదలుగాఁగల భూసురభార్యలను మఱియు సకలబంధుజనంబును రావించి బంగరుటరదంబుల నిడికొని తోడ్కొని రమ్మని యంపినతండును మహాప్రసాదంబని తత్క్షణమ యంతఃపురంబునకుం బోయి కౌసల్యా కైక సుమిత్ర మొదలగు రాజకాంతలను వసిష్ఠాది ద్విజవరిష్ఠులను నరుంధతి మొదలుగాఁగల ముత్తైదువలను మిగిలిన సకల బంధుజనమ్మును రావించి యుక్తప్రకారమ్ముగాఁ గనకరథమ్ములపై నిడికొని దశరథమహారాజు కడకుం గొనివచ్చినయంత దశరథుండు పుత్రద్వయసహితమ్ముగ రథమారోహించి సమస్తసేనా సమన్వితుండగుచు వాద్యఘోషంబులు దశదిశలు నిండ నడుచుచున్న సమయమ్మున నంతకుముందు జనకభూవల్లభుండు దశరథమహీపాలు నెదు

రొక్కని తోడితెచ్చి యడుగులు గడిగి యర్ఘ్యపాద్యాదివిధుల వి ధ్యుక్తంబుగాఁ బూజించి మానితంబుగఁ గానుక లొసంగి సకల సంపత్సంపూర్ణ మయినని వేళముం గల్పించి యందుఁ బెండ్లివారిని విడియించెనంత నక్కడఁ గనకవికార మైన పీఠమ్ముపైఁ గూర్చు న్న సమయమ్మున దేవా! శుభముహూర్తంబాసన్న మగుచున్నది రమ్మని వశిష్ఠుండు సనుదేర నాతఁడు సని రామలక్ష్మణభరతశ త్రుఘ్నులకు మంగళస్నానమ్ముఁ జేయించి నిర్మలాంబరాభరణం బులొసంగి వేర్వేఱ నొక్కముహూర్తమ్మునఁ దన కూఁతుసీతను శ్రీ రామచంద్రునకును, దనతమ్ముఁడు కుశధ్వజునికూఁతు లగుమాండ వ్యూర్మిళాశ్రుతకీర్తులను భరతలక్ష్మణశత్రుఘ్నులకును నిచ్చి వివా హముం జేసి తనపిృయతనయల కొక్కొక్క తెకు నూఱేసి భద్రగజ మ్ములను వేయేసి తురంగంబులను బదివేలు దాసీజనమ్మును లక్ష ధేనువులను వరణంబులిచ్చి దశరథాది రాజలోకమ్మునకు బహుమా నమ్ముగా నవరత్న ఖచితభూషణమ్ములును జీనిచీనాంబరమ్ములును నొసంగి సుగంధద్రవ్యమ్ముల నర్పించి పూజించి యంపె నంత దశ రథమహారాజు మరలి యయోధ్యాపట్టణంబునకు వచ్చుచుండఁగా మధ్యేమార్గంబున.

## —♦ పరశురాముని భంగపాటు. ♦—

గీ. పరశురాముఁ డడ్డుపడి వచ్చి మీనామ
మెవ్వ రనిన మొలకనవ్వుతోడ
నేను దశరథుండ నితఁడు నాపుత్త్రుండు
రాముఁ డండ్రు పేరు భీమబలుఁడు. 39

వ. అని వినుపించినఁ గ్రోధావేశవశంవదుండై యప్పుడప్పరశురాముం
డు రాముం గనుగొని యిట్లనియె. 40

క. రాముఁడు నేనై యుండఁగ
నామీఁద నొకండు గలిగెనా మఱి యేఁ గా
కేమాయె రణ మొనర్పఁగ
రామా! రారమ్మటంచు రహిఁ బిలిచెఁ దగన్. 41

వ. పిలిచినతోడనే రామచంద్రుండతని కిట్లనియె. 42

గీ. బ్రాహ్మణుండ వందుఁ బరమపవిత్రుండ
వదియుఁగాక భార్గవాన్వయుండ

వైననిన్నుఁ దొడరి యాహవస్థలమున
జగడ మాడ నాకుఁ దగునె చెప్పుమ. 43

వ. అనిన విని పరశురాముం డిట్లనియె. 44

ఉ. శస్త్రముఁ దాల్చినందగునె సన్నుతికెక్కిన బ్రాహ్మణుం డనన్
శాస్త్రము గాదు నా కెదిరి సంగరభూమిని నిల్చినంతనే
శస్త్రముఖంబులన్ నృపులఁ జక్కఁగఁ జేయుదుఁ గాన నిప్పుడున్
శస్త్రము శాస్త్రముం గలవు సాహసవృత్తిని రమ్ము పోరఁగన్. 45

వ. అనిన రామచంద్రుం డిట్లనియె. 46

మ. విను మావంటి నృపాలురైనఁ గలనన్ వీరత్వముం జూపఁగా
నన యోగ్యంగాక మహానుభావుఁడవు విన్నాలంబులో మీఱఁగా
నెనయన్ ధర్మువె మాకుఁ జూడమటి నీవేమన్న నీమాటకుం
గనలన్ మంచిది కాదు మాకెపుడు దోర్గర్వంబు మీపట్లునన్. 47

వ. అనిన విని యెంతయు సంతోషించి భార్గవరాముం డారఘురా
మునితో నిట్లనియె. 48

గీ. శివుని చివుకువిల్లు శిఘ్రుంచె యానాఁడు
విఱిచినాఁడ ననుచు విఱ్ఱవీఁగ
వలదు నేఁడు నాకు వశ మైనయీచాప
మెక్కు పెట్టి తివియు మింతె చాలు. 49

ఉ. రాముఁడు నీవుఁ డంచును ధరాజను లెల్ల నుతింప దిట్టవై
భీమునిచాపమున్ విఱిచి పేర్చెద వందుల కేమిగాని యీ
శ్రీమహిళేశుకార్ముకముఁ జేకొని యెక్కిడు దేని నేఁడు నీ
తో మఱి పోరు సల్పి పడఁద్రొక్కెద రణస్థలి నీశరీరమున్ 50

చ. అని తనచేతివిల్లు నృపు లందఱుఁ జూడఁగ నందియీయ నా
ధనువును గూడి తేజముఁ బ్రతాపముఁ రామునిఁ జెందెనంత నే
జనవరుఁ డాశరాసనముఁ జక్కఁగ నెక్కిడి వాఁడిబాణ మం
దునఁ నిడి యేదిలక్ష్యమనఁ ద్రోవలు సూపినఁ ద్రుంచె గ్రక్కునన్. 51

వ. ఇట్లు మహాప్రతాపంబునఁ దాపలు ద్రుంచి యనర్గళప్రతాపమ్మున భార్గవరాము దోర్గర్వంబు నిర్గర్వంబు గావించి జయమ్ముఁ గైకొన్న శ్రీరామునిం గౌఁగలించుకొని దశరథుండు కుమారచతుష్టయమ్ముతో నయోధ్యానగరంబుఁ బ్రవేశించి సుఖోన్నతి రాజ్యంబు నేలుచుండె. 52



# కుచేలోపాఖ్యానము



క. శ్రీమద్భాగవతార్థ
స్తోమంబులు దెలుపునెడల శుకయోగీంద్రుం
డామోదమునఁ బరీక్షి
ద్భూమీశున కనియె వాక్ప్రభుత్వము మెఱయన్. 1

## పురవర్ణనము.

క. నెరయఁ బ్రసిద్ధము మధురా
పురము సమీపమునఁ బంట పొలఁతికి రత్నా
భరణంబై పలసిల్లును
నరనాథ యవంతిపట్టణ శ్రేష్ఠమిలన్. 2

మధురగతి రగడ:—

అది గడు నున్నత మర్యోడికోటలు

పదవం బగు నచ్చపుఁ బూఁదోఁటలు
మాణిక్యంబుల మయ మగువేదులు
నానౌము లగు అన్నని బహువీథులు
కడునైషికతలు గలిగినయాజాలు
పుడమిని ధర్మముఁ బూనినరాజులు
ధర్మవినిర్మిత బహుసౌధంబులు
నిర్మల మణిమందిర యూధంబులు
పచ్చలు గూర్చిన బలుతోరణములు
మచ్చిక లెసఁగెడి మదవారణములు
కట్టందములుగఁ గట్టిన తేరులు
నెట్టినసాములు నేర్చినశూరులు
నవరత్నంబుల నయమగుమేడలు
కవగూడిన పటికంపుల గోడలు
పటుతర గేహా పాప్రసాదంబులు
స్ఫుటతర భేరీపుట నాదంబులు

* * *

శ్రీలఁ గుబేరునిఁ బెనఁకెడు వైశ్యులు

నిర్మలఁ బొడవగు నిలహోమంబులు
కమ్మని కృష్ణాగరు ధూమంబులు
నిరుపమ మాగధ నిజగానంబులు
గరిమవహించిన ఘనయానంబులు
విమలోదకములు వెలసినబావులు
సమచతురములగు చల్లనితావులు
మహితబలంబుల మహిసామంతులు
బహువిద్యల నేర్పగు ధీమంతులు
దూతాదులకును దోడగు తంత్రులు
నీతులు పతులకు నేర్పెడు మంత్రులు

* * *

గలిగిధరిత్రిని ఘనత వహించెను
అలకాపురవరమనఁగ రహించెను 8

తే. ఆమ్మహాపట్టణంబున కనతిదూర
మైనఘోరాటవీమధ్య మాద్రిశిఖర
దివ్యదేశంబునను సన్నుతింప మిగుల

బట్టుమైనది తాపసి పల్లె గలుగు. 4

## కుచేలమహాముని మహిమ.

క. అందుఁ గుచేలుం డనుముని
నందనుఁడొక్కరుఁడు దినదినము హరిసేవా
నందంబున సకలేంద్రియ
బృందములఁ బరిత్యజించి పేర్మివహించున్. 5

తే. శతసహస్ర పరిచ్ఛేద సంఘటిత పు
రాణజీర్ణోత్తరీయంబు రమణదాల్చి
మానుల కుచేలుఁ డీమహామహుఁడనంగఁ
బేరుగొన్నాఁడు దిక్కులు పిక్కటిల్ల. 6

క. ఆముని నిజభార్య జన
స్తోమంబులు పొగడఁదగిన సుందరసుగుణో
ద్దామత నాయమవందలు
వామాక్షియనంగఁ దనరు వసుధాధీశా. 7

తే. ఆపతివ్రత పెనిమిటి ననుసరించి

నులభమున నిర్వదేడ్గురఁ సుతులఁ గనియెఁ
బేదతనమునకే కాదె పెక్కువైన
బిడ్డల నొసంగు విధి యెంత దొడ్డతనము. 8

క. వినువక యడవులరాలిన
కసవుల ధాన్యములఁ దనకు గ్రాసంబులుగా
వసుదేవ సుతుని గొలుచుచుఁ
బసిబిడ్డలు నాలు నతఁడు బ్రతుకు నరేంద్రా. 9

చ. పిడికెఁడు దూసరొడ్లు కడుఁ జేర్మి దినంబును నేటితెచ్చి యా
పడఁతికిఁ దద్విభుండొసఁగ బ్రాహ్మణియున్ బచనంబుచేసి యే
ర్పడ మఱి యంతలో నతిథిభాగము దీసి లతాంగి భర్తకుం
గుడువఁగ బెట్టి భుక్తిఁగొను కోమలి సంతతి దాను బంక్తులన్. 10

తే. జగతి నావిప్రవరుఁ డయాచకుఁడు గాన
నింటిలోపల ధాన్యంబు లెపుడు లేవు
కోమలికిఁ బూటపూటకుఁ గుడువఁ గూటి
బిడ్డలను నేగతిని మట్టు పెట్టవచ్చు. 11

సీ. సన్నంపునార లాచ్ఛాదించుటయె కాని
తొడుగఁ గోకలులేవు బుడుతలకును
పసినాఁడు గట్టిన పాలపూసలె కాని
పెట్ట సొమ్ములులేవు బిడ్డలకును
బిడికెఁడు బియ్యంబు పేదగంజియ కాని
త్రాఁగ బాలునులేవు తనయులకును
దట్టంబులైన వస్త్రపుటంబులే కాని
కుడువ గిన్నెలులేవు కొడుకులకును

తే. నిరుగుపొరుగునవారల యిండ్లనెల్ల
వివిధమార్గంబులను సిరు ల్వ్యాప్తిఁగఁ
కుడిచికట్టెడు శిశువుల గోము లరసి
తల్లి యెట్లోర్చుఁ దన పేదతనమునకును. 12

క. బిడ్డల పేదరికంబున
కడ్డంబై పెంచుకొనుచు నధిపునకును మా
యొడ్డక సద్గుణ గావున
నొడ్డారము సేయకెలమి నుండెఁ నృపాలా. 13

ఆ. కలిమి గలుగువట్లఁ గాంతునకును బ్రియం
బొనరఁ జేయవచ్చు నుచితవృత్తిఁ
బేదతనమునందుఁ బెనిమిటి మనసురాఁ
దిరుగ నేర్చునదియె గరిత యనఘ. 14

సీ. పొరుగుపిల్లలతోడి పురుడున కేమైన
నాటలకిమ్మన్న నాలసించుఁ
బప్పుబెల్లములకై బ్రతిమాలి యేడ్చుచుఁ
గొంగుఁ బట్టీడ్చినఁ గుస్తరించుఁ
బాలువెన్నలకుఁగాఁ బ్రామిడివడిఁ బోరఁ
జన్నిచ్చి కౌఁగిట సంగ్రహించుఁ
బోగు లుంగరము లీ పూఁటఁగావలెనన్న
మాపు తేపని పలుమాఱు బొంకు

తే. గలిమి లేము లెఱుంగక గడునువఁగల
బిడ్డలింపైనవస్తువు లడ్డులేక
కొంటెతనమునఁ దెమ్మంచుఁ గోరగింపఁ
దల్లియేమియు ననలేక తల్లడించె. 15

క. ఈరీతిని శిశువులు దనుఁ
బోరాడిన మగని దూఱఁబోసక పలుమా
ఱా రామామణి దినములు
పోరామిని గడపు సాటి పోటులు మెచ్చన్. 16

## భార్యపతిని కృష్ణునియొద్దకుఁ బోవేఁడుట

వ. ఇట్లత్యంత ఘోరంబయిన దారిద్ర్య చింతాభరంబున సంసార పా
రావారంబు దరియింపఁజాలక, నుతులతోఁ బోరాడుచుం దత్కాం
తారత్నంబు సతతదయాస్వాంతుండును, సకలసద్గుణవంతుండును,
నయిన తనకాంతునిం గదిసి యేకాంతంబున నిట్లనియె. 17

తే. స్వామి మీరెన్నటికి నయాచకుల రగుట
యాచకులు గాక యుండుట నాత్మఁ దెలియ
నైనఁ గక్కూర్తిమాట దా నాడుకొనెద
వరయ మీమన్ననలఁ గుచేలాగ్రగణ్య. 18

క. యాదవవల్లభుఁడును మీ
కాదిస్నేహితుఁ డటంచు నందఱు దెలుపన్

మోదమున విందు నెపుడా
శ్రీదయితుని సమ్ముఖంబుఁ జేరి సుహాత్మా. 19

తే. చిన్నవాండ్రకు నేమైన సిరులు వేఁడి
తెచ్చి రక్షించుకొనుము నా దేహ మెడల
నొగిలె 'సర్వేజనాస్సుఖినోభవంతు'
నియెడివాక్యంబు తలపోయు నిర్మలాత్మ. 20

తే. పూర్వసఖుఁడైన యాదవపుంగవుండు
మిమ్ముఁ బొడగన్న సిరులెల్ల మిన్న కొసఁగు
నెఱుక పిడికెఁడు ధనమన్న గుఱుతుమాట
తథ్యమాఁ గాదె యెందైన దాపసేందరి. 21

మ. ఘనుఁ డాకంసవిభంజనుండు త్రిజగత్కాంతుండు మోదంబునన్
మనకుం బెక్కుసిరుల్ ఘటించుఁ గడుసమ్మానించుఁ గాదేనిత
ద్వనజాతాక్షుని పాదపద్మములఁ బ్రేమం జూచినం జాలదే
చనుఁడీ యిప్పుడు భోగమోక్షములకున్ సాధ్యుండు కృష్ణుండిలన్

క. తాత్రిలుచెడ నెమ్మనుల
క్షీణించిరి బువ్వలేక చెడి బిడ్డలు పా
రాణిక 'లన్నంబనకను.

బాగ్రీణమునకు లంకె' యనెడి పలుకులు మృషలే. 23

క. నెరవుగ నాఁకటి పిల్లన
మురమర నఱ్ఱిక్కుదరు మన శిశువులం జూడన్
దురితము దారిద్ర్యంబులఁ
బొరయక మనుచున్న వారె పుణ్యులు జగతిన్. 24

సీ. రూపింపనిర్మల రూపంబు నెడలించు
రక్తమాంసముల భాగము లడంచు
నుద్యోగములకునై యూహ సేరఁగనీదు
మగల కింతులకునుఁ బగలు సేయు
బహుళశంబు లైనలోభంబు లుత్పాదించు
సూనృతవాక్యంబు నూఱఁబుచ్చుఁ
జాలదు రాశావిచారంబు గల్పించు
మానంబు చెడఁ బ్రతిమాలిపించు

తే. సదసద్వృశానంద వనమున కగ్నికీల
యతిశయాకాగ్రింతచింతావిహరణభూమి
భూరి దుఃఖంబులకు నెల్లఁ బుట్టినిల్లు
పరిజలకును లేమికంటెఁ బాపంబు గలదె. 25

వ. అనిన నవ్వధూరత్నంబునకుఁ గుచేలుం డిట్లనియె. 26

క. తరుణీ పూర్వభవంబున
గుఱి మీఱఁగఁ జేసినంత కుడుతురు పిదపన్
నర లీజన్మంబునఁ గడు
దురపిల్లఁగ నేల యిట్టి తోయంబులకున్. 27

ఆ. ధనము గూర్చవలెనె తనయులకును భుక్తు
లిడెడు నాఁడు శ్రీరమేశ్వరుండు
మృగసమాజములకు మేపు నీళ్లెవ్వఁడు
వెట్టి పోషించు నెలమి నట్టడవుల. 28

* * *

వ. అని సర్వంబునకు సర్వేశ్వరుండు గలండు పరిజనరక్షింప నేనుస
మర్థుండ నే యని విరక్తుండై పలికిన నతని చిత్తంబు మెత్తంజేయం
జాలక వెచ్చనూర్చుచు నచ్చెలువ వెండియు నిట్లనియె. 29

క. బలువుగ సత్కర్మంబులు
దలఁచి యొనర్పకయ ఫలము దైవం బిడునే?
హాలికుఁ డదనెఱిఁగి విత్తన
మిల వెదవెట్టకయె పండునే ధాన్యంబుల్. 30

ఆ. మనుజుఁ డెల్లపొద్దు మానక సేయంగ
దైవయత్న మొకటి తారసిల్లుఁ
గాక యూరకున్నఁ గలదె భుక్తమునకు
దైవమానుషములు దగ సమములు. 31

తే. పరఁగ నట్టింటనుండి నా భాగ్యమనిన
దైవమొక్కఁడుఁ గొని తెచ్చి తనకునిచ్చుఁ
జేయఁదగిన ప్రయత్నముల్ సేయఁజేయ
నథిప యటమీఁద వారి భాగ్యంబుకొలఁది. 32

ఆ. దేవుఁ డిచ్చునను చు దినదిన యత్నముల్
సేయకున్న నేల సిరులుగల్గుఁ ?
బళ్లెరమున నిడిన పంచభక్ష్యాన్నముల్
కుడువకున్న నెట్లు కడుపునిండు. 33

క. కావున మనుజుఁడు సేయక
దేవుం డీయంగ లేఁడు తెగ యేమియు నా
నావిధ ధాన్యము లుండిన
వావిరి వండకయె రిత్త వంటక మగునే. 34

క. అడుగక యుండినఁ దగువర

మిడునే నిష్కారణంబు యీశ్వరుఁ డైనం
బుడమి జ్ఞేయావు చేతులు
కుడువదు నో రసెడు మాటకును దప్పగునే

క. తొల్లిఁ మునులు తపంబులు 35
మొల్లముగా జేసి శౌరి మొనసిన పిదపన్
సల్లలితంబుగ వేఁడ శ
యుల్లములకు బ్రియము లైన యుచితార్థంబుల్. 36

తే. మీరు కృష్ణుని మెఱయ నమ్మిన మహాత్ము
లతిశయంబుగ నిష్కాము లైన నేమి
పరిజనరక్షించు టెల్లను బరమధర్మ
మధిప యాచింపు సుకృతాత్ముఁ డైనహరిని. 37

క. దైవంబె నీకు శ్రీహరి
దావలముగ నీవు మాకు దైవమువనిలో
భావింపఁగ నిట్లగుటకు
నేవిధమున నైననన్య మెఱుఁగమధీశా. 83

ఆ. సకల భువనములను సంరక్షణము సేయ
నీశ్వరుండె కర్త యెంచి చూడ

మమ్ము సంతసించి మన్నింప రక్షింపఁ
గర్తవీవు సకల కార్యములకు. 39

వ. అని యనేకప్రకారంబుల నిలిపవచనంబు లుగ్గడించి, తొల్లిటివారు నడుచు క్రమంబుఁ దెలిపి, ప్రజారక్షణంబు పరమధర్మంబని ప్రార్థించిన. 40

తే. ఎట్టికేలకుఁ దత్కార్యభార మియ్యకొనుచు
గాంచనాంబరు నెలమి సేవించుటయును
బ్రజల రక్షించుటయు మంచి పని ఘటిల్లె
తీర్థమును స్వార్థము నటంచుఁ దెలిసి యతుడు. 41

ఉ. భామినితోడ నిట్లనియెఁ బద్మదళాక్షుని గానఁ బోయెదన్
గోమలి బల్ దరిద్రులము గొంచుఁ జనన్ మనకేది వస్తువా
స్వామికి నిష్టమైనయది సంగతియే చన రిక్తచేతులన్
భూమిపులొద్దకున్ సతుల పొంతలకున్ గురులున్న చోటికిన్. 42

చ. గరిమ సమస్తవస్తువులు గల్గినవారలు దేరఁ జాలఁ బె
ద్దఱికము(?) చేసి పంపుదురు తండ్రి సుతుండనుజన్ముఁడైన బ
ల్పరిభవ మాచరింపుదురు భామిని పేదరికంబు దోఁచినన్
సిరి చెడిపోయి చుట్టములఁ జేరిన లాఘువ మందియుందు సే. 43

క. సధనుల కడకు దరిద్రుం
డధవా పోరానిపట్ల నరిగిన యేసే
విధమునఁ గైకొని చనవలె
నధికము లగు వస్తువులు సితాంభోజముఖీ. 44

తే. ఎట్టికేలను విహితుల యిండ్ల కేఁగి
పెరిమెఁ దా నూరకుండుట పెద్దతనము
గలదె యడుగుటకంటెఁ బల్చెలకఁదనము
(యాచనముతోనె గౌరవ మంతరించు). 45

క. రంజిలి తా మునుమున్నగ
నంజలిపడ కిచ్చెనేని నయముగ వారున్
గొంజగ నిత్తురు క్రిమ్మఱ
ముంజేయియు నాడెనేని మోఁచేయాడున్. 46

తే. కావున సమస్త సామ్రాజ్యకర్తయైన
యిందిరాధీశునకుఁ గాను కీఁగవలయుఁ
'జందురినకు నూలిపో' గన్న సామె తగును
గాన నేమైన మనశక్తి గలకొలంది. 47

క. కొండికలము మన కెంతటి
దండి గలుగు నధికవస్తు తతి హరి కొసఁగన్
కొండంత దేవునకు మఱి
కొండంతయుఁబత్త్రి యిడెడు కుశలులు గలరే. 48

క. అదిగావునఁ గార్యార్థము
మదనగురునికడకు నిపుడు మనమూరక పో
విదితముగా దేవెర వన
ముదితయుఁ దనవిభునివాక్యములకు నలరుచున్. 49

క. తిరవుగఁ గొన్నిదినంబులు
నిరతంబుగ నుపవసించి నివ్వరియడుకుల్
దొరకినయట్లు వధూమణి
పరుని కుచేలమున ముడిచి పనిచిన యంతన్. 50

క. ధరణీసురుఁ డాదినమున
హరిసేవార్థంబు గదలి యతిదూరముగా
గిరులును కానలు నదులును
బురములు గ్రామములు గడచి పోవుచునుండెన్. 51

